# తిరుప్పావై

తిరుప్పావై విష్ణువును కీర్తిస్తూ, గోదాదేవి మూలద్రావిడంలో గానం చేసిన ముప్పై పాశురాల గీతమాలిక. ఇది పన్నిద్దరాళ్వార్లు రచించిన నాలాయిర దివ్య ప్రబంధములో ఒక ముఖ్య భాగమై, తమిళ సాహిత్యంలో ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకుంది.

భారతదేశంలో ధనుర్మాసంలో పెళ్ళికాని పడుచులు, తమకు మంచి భర్తని ప్రసాదించమని గోదా దేవి (ఆండాళ్) ని వేడుకుంటూ, పాటలు పాడే ఒక సాంప్రదాయం ఉంది, దీనినే కాత్యాయినీ వ్రతం అంటారు. ఆ కోవకు చెందినదే తిరుప్పావై వ్రతం, ద్వాపర యుగంలో శ్రీకృష్ణుని భర్తగా కోరుకుంటూ గోపికా స్త్రీలు ఇదే వ్రతాన్ని ఆచరించారన్నది ఆండాళ్ నమ్మిక. శ్రీ వైష్ణవులు ఏడాది పొడుగునా, ప్రతిదినం తమ యిళ్ళలో, దేవాలయాల్లో విధిగా ఈ పాశురాలను పఠిస్తారు. కాని ధనుర్మాసంలో పాడే ఈ పాటలకు ఒక ప్రత్యేకత ఉంటుంది. ఒక్కొక్క పాశురం ఒక్కొక్క రోజు గానం చేయబడుతుంది. తిరుప్పావై, ధనుర్మాసంలో శ్రీ వైష్ణవులు ఆచరించవలసిన కొన్ని వైష్ణవ ధర్మ నియమాలను నిర్దేశిస్తుంది. దేశమంతటా శ్రీ వైష్ణవులు భగవత్కృప, శాంతిసౌఖ్యాలను కోరుకుంటూ, వీటిని గానం చేస్తారు. ఆండాళ్ తన చెలులతో కలిసి, శ్రీకృష్ణుడిని భర్తగా పొందడానికై తిరుప్పావైని గానం చేస్తూ, ముప్పై రోజులు కఠిన వ్రతమాచరిస్తుంది.

పన్నిద్దరాళ్వారులలో ఒకరైన గోదాదేవి రచించిన ముప్పది పాశురాల ప్రబంధం. వైష్ణవులు పరమ పవిత్రంగా పఠించే ఈ పాశురాలు మధుర భక్తిని ప్రబోధిస్తాయి. గోదాదేవి విష్ణుచిత్తుడనే ఆళ్వారుకి తన పూల తోటలో ఒక తులసి చెట్టు వద్ద దొరికింది. ఆమె పెరిగి పెద్దదవుతున్న కొలదీ శ్రీరంగనాథుడి పట్ల భక్తి పెరుగుతూ, ఆయనను వివాహం చేసుకొంటానని పట్టు పట్టింది.విష్ణుచిత్తుడు భక్తుడైనప్పటికీ ఇలా వివాహం జరగడం అసంభవమని భావించాడు. కానీ, గోదాదేవి భక్తి ఫలించి, రంగనాథుడు స్వప్నంలో గోదా దేవిని వధువుగా అలంకరించి ఆలయానికి రప్పించవలసిందని పెద్దలను ఆజ్ఞాపించాడు. సాలంకృత కన్యగా ఆమె గర్భగుడిలోకి ప్రవేశించి, స్వామిని అర్చించి రాజుతో సహా అందరూ చూస్తుండగా స్వామిలో లీనమైపోయిందని ఐతిహ్యం. ఇది ఎనిమిది, తొమ్మిది శతాబ్దుల మధ్య జరిగిన ఉదంతంగా పలువురు పరిశోధకుల అంచనా. మార్గశిర మాసంలో గోదాదేవి తన ఈడు ఆడపిల్లలతో కోవెలకు వచ్చి నెలరోజుల పాటు గానం చేసిన ముప్పది గీతాలే (పాశురాలే) ఈ తిరుప్పావై. తిరు అనేది మంగళ వాచకం. శ్రీకరం, శుభప్రదం, పవిత్రం మొదలైన అర్థాలు ఉన్నాయి. పావై అంటే వ్రతం. ఈ వ్రతాన్ని వైష్ణవులు మార్గశీర్ష వ్రతమనీ, ధనుర్మాస వ్రతమనీ అంటారు. (గోదాదేవి చేసింది కాత్యాయనీ వ్రతమని కొన్ని వ్యాఖ్యాన గ్రంథాలలో ఉంది.) తెలుగులోనూ ఈ పాశురాలకు చాలా అనువాదాలు వచ్చాయి. అనువాదం చేసిన వారిలో దేవులపల్లి కృష్ణ శాస్త్రి, లక్ష్మణ యతీంద్రులు మొదలైన గొప్ప కవులు, తత్త్వవేత్తలు ఉన్నారు. గొప్ప వైష్ణవ సాహిత్యమనేగాక, (తమిళంలో) సాహిత్య విలువల దృష్ట్యా సైతం తిరుప్పావై గొప్ప రచన.



# 1.పాశురము

మార్గళి త్తిజ్ఞల్ మది నిరైన్ద నన్నాళాల్
నీరాడ ప్పోదువీర్, పోదుమినో నేరిలైయీర్
శీర్ మల్గుమ్ ఆయ్ ప్పాడి శెల్వచ్చిరు మీర్ కాళ్
కూర్వేల్ కొడున్దొళిలన్ నన్దగోపన్ కుమరన్
ఏరార్ న్ద కణ్ణి యశోదై యిళంశింగమ్
కార్మేనిచ్చజ్ఞణ్ కదిర్మదియం బోల్ ముగత్తాన్
నారాయణనే నమక్కే పరైతరువాన్
పారోర్ పుగళప్పడిన్దేలో రెమ్బావాయ్

**భావము:** సుసంపన్నమైన గోకులంలో పుట్టి సుశోభితులైన గోపికలారా-మార్గశీర్ష మాసం ఎంతో మంచిది. వెన్నెలలు కురిపిస్తుంది. చాలా మంచి రోజులివి. శూరుడైన నందగోపుని కుమారుడును, విశాల నేత్రియగు యశోదకు బాల సింహము వంటి వాడును, నల్లని మేఘము వంటి శరీరమును, చంద్రునివలె ఆహ్లాదకరుడును, సూర్యునివలె తేజోమయుడును యైన నారాయణునే తప్ప, యితరములను కోరని మనకు ఆ స్వామి వ్రతమునకు కాలవసినవిచ్చుటకు సిద్ధపడినాడు. కావున మీరందరూ యీ వ్రతములో ప్రవేశించి లోకము ప్రకాశించునట్లుగ దాని కంగమైన మార్గళి స్నానము చేయు కోరికగల వారందరును ఆలసింపక శ్రీఘ్రముగ రండని శ్రీ గోదాదేవి గొల్ల కన్నియలందరను ఆహ్వానించుచున్నది.



# ౨.పాశురము

వైయత్తు వాళ్వీర్గాళ్ నాముమ్ నమ్బావైక్కు
చ్చెయ్యుమ్ కిరిశైగళ్ కేళీరో పార్కడలుళ్
పై యత్తు యిన్ర పరమనడిపాడి
నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్ నాట్కాలే నీరాడి
మైయిట్టెళుదోమ్ మలరిట్టు నాముడియోమ్
శెయ్యాదన శెయ్యోమ్ తీక్కురళై చ్చెన్రోదోమ్
ఐయ్యముమ్ పిచ్చైయుమ్ ఆన్దనైయుమ్ కైకాట్టి
ఉయ్యు మారెణ్ణి యుగన్దేలో రెమ్బావాయ్.

**భావము** : భూలోకంలోని గోకులంలో పుట్టిన భాగ్యవతులారా! మనం చేయబోయే వ్రతానికి ముఖ్యంగా ఆచరించవలసిన కృత్యముల వినుడు. శ్రీ మన్నారాయణుని పాదారవిందాలకు కీర్తిస్తాము. అతనితో కల్గిన విశ్లేష సమయాన ఇతరములైన ఎట్టి భోగ్య విషయాలను తలచము. పాలను త్రాగము. కన్నుల కాటుక నుంచము. నేతిని భుజింపము. సిగలో పూలను దాల్చము. అనగా శాస్త్ర విరుద్ధములైన ఎట్టి పనులను చేయము. ఒకరిపై చాడీలను చెప్పము. సత్పాత్రదానము చేతము. సన్యాసులకును, బ్రహ్మచారులకును సత్పత్రదానము చేతుము. ఇంకను ఉజ్జీవించు మార్గములేవైన యున్న వాని నెరిగి సంతోషముతో నాచరింతుము. ఇట్లు యీ ధనుర్మాస కాలమంతయు కొనసాగింతుము. ఇదియే మన వ్రతము.



## 3.పాశురము

ఓంగి యులగళన్ద ఉత్తమన్ పేర్పాడి
నాంగళ్ నమ్బావైక్కు చ్చాట్రి నీరాడినాల్
తీంగన్రి నాడెల్లామ్ తింగళ్ ముమ్మారి పెయ్ దు
ఓంగు పెరుమ్ శెన్నెల్ ఊడు కయలుగళ
పూంగువళై పోదిల్ పొరివణ్డు కణ్పడుప్ప
తేంగాదే పుక్కిరున్దు శీర్ త్తములై పట్రి
వాంగక్కుడమ్ నిరైక్కుమ్ వళ్ళల్ పెరుమ్బశుక్కళ్
నీంగాదశెల్వమ్ నిరైన్దేలో రెమ్బావాయ్.

**భావము:** ఈ వ్రతానికి ప్రధాన ఫలము శ్రీ కృష్ణ సంశ్లేషమే! ఐనా దీనిని చేయటానికి అనుమతించిన వారికి కూడా ఫలితం కలుగుతుంది. బలిచక్రవర్తి నుండి మూడడుగుల దానాన్ని పొందిన శ్రీకృష్ణ పరమాత్మ అత్యంతానందాన్ని పొంది ఆకాశమంత ఎత్తుకెదిగి మూడు లోకాలను కొలిచాడు. ఆ పరమానంద మూర్తి దివ్యచరణాలను, అతని దివ్య నామాలను పాడి, యీ దివ్య ధనుర్మాస వ్రతాన్ని చేసే నిమిత్తం మార్గళిస్నానాన్నాచరిస్తే - దుర్భిక్షమసలు కలుగనే కల్గదు. నెలకు మూడు వర్గాలు కురుస్తాయి. పంటలన్నీ త్రివిక్రముని వలె ఆకాశమంత ఎత్తుకెదిగి ఫలిస్తాయి. పంటచేల మధ్యనున్న నీటిలో పెరిగిన చేపలు త్రుళ్లిపడుతూ ఆనంద సమృద్ధిని సూచిస్తాయి. ఆ నీటిలో విరిసిన కలువలను చేరిన భ్రమరాలు అందలి మకరందాన్ని గ్రోలి మత్తుగా నిద్రిస్తాయి. ఇవన్నీ సమృద్ధికి సంకేతాలే! ఇక పాలు పిదుక గోవుల పొదుగలను తాకగానే - కలశాలు నిండునట్లు క్షీరధారలు అవిరళంగా నిరంతరంగా కురుస్తాయి. ఇలా తరగని మహదైశ్వర్యంతో లోకమంతా నిండిపోతుంది. కావున వ్రతాన్ని చేద్దాం రమ్మని సఖులందరినీ పిలుస్తోంది గోద!



## 4.పాశురము

ఆళిమళైక్కణ్ణా ! ఒన్రు నీకై కరవేల్
ఆళియుళ్ పుక్కు ముగున్దు కొడార్తేరి
ఊళిముదల్వ నురువమ్పోల్ మెయికరుత్తు
పాళియందోళుడై పర్పనాబన్ కైయిల్
ఆళిపోళ్ మిన్ని, వలమ్బురి పోల్ నిన్రదిరిన్దు
తాళాదే శార్ జ్ఞముదైత్త శరమళైపోల్
వాళవులగినిల్ పెయ్ దిడాయ్ నాంగళుమ్
మార్గళి నీరాడ మగిళిన్దేలో రెమ్బావాయ్

**భావము:** ఓ పర్జన్య దైవమా! వర్షమును కురిపించుటలో లోభత్వమును జూపకుము. నీవు సముద్రములోని నీటి నంతను కడుపు నిండుగ త్రాగుము, అటుపిదప నీవు పైకెగసి, సృష్టికంతకును కారణభూతుడైన ఆ శ్రీమన్నారాయణుని శరీరపు రంగు వలె నీ శరీరమునకును ఆ నలుపురంగు నద్దుకొనుము. స్వామి కుడి చేతియందున్న సుదర్శన చక్రము వలె మెరయుము. ఎడమ చేతిలోని పాంచజన్య శంఖమువలె గంభీరముగా గర్జించుము. స్వామి సారంగమను ధనుస్సు నుండి వెడలే అవిరళ శరాలుగ వర్షధారలను కురిపించుము. మేమందరము యీ వర్ష ధారలలో స్నానమాడెదము. లోకము సుఖించునట్లు వర్షించుము మా వ్రతమును నిరాటంకముగ జేసికొనుటకై యిక ఏ మాత్రమూ ఆలసింపక వెంటనే వర్షింపుము స్వామీ!



## 5.పాశురము

మాయనై మన్ను, వడమదురై మైన్దనై
త్తూయ పెరునీర్ యమునై త్తురైవనై
ఆయర్ కులత్తినిల్ తోన్రుమ్ మణి విళక్కై
త్తాయైకుడల్ విళక్కమ్ శెయ్ద దామోదరనై
తూయోమాయ్ వన్దునామ్ తూమలర్ తూవిత్తొళుదు
వాయినాల్ పాడి, మనత్తినల్ శిన్దిక్క
పోయపిళ్ళైయుమ్ ప్పుగుదరువా నిన్రనవుమ్
తీయినిల్ తూశాగుం శెప్పేలో రెమ్బావాయ్

**భావము:** మిక్కిలి ఆశ్చర్యకరమైన గుణములను, చేష్టలను కలవాడు శ్రీకృష్ణుడు. అతడు ఉత్తర మధురకు నిర్వాహకునిగ జన్మించాడు. భాగత్సంబంధము ఎడతెగనట్టి మధురకు మధురకు ప్రభువే. యమునా నదీతీరమందున్న గొల్ల కులమున జన్మించి, ఆ గొల్లకులాన్ని ప్రకాశింపజేసినవాడు. గొల్లకుల మాణిక్య దీపము తల్లి యశోదా గర్భమును కాంతివంతమొనర్చిన దామోదారుడు. వ్రతకారణముగా శ్రీకృష్ణుని చేరి, మనము ఇతరములైన కోరికలేవీ కోరక, పవిత్రమైన మనస్సులతో స్వామికి పూలనర్పించి, నమస్కరించి, నోరార అతని కల్యాణ గుణములను సంకీర్తన చేసి, ధ్యానించిన -సంచిత పాపములను, ఇక ఆగామి పాపములను తప్పించుకొనవచ్చును. అతని గుణకీర్తనం చేయటం వలన పాపములన్ని అగ్నిలో పడిన దూదివలె భస్మమై పోయేవే! కావున స్వామియొక్క తిరునామములను అనుసందించుడు.



## ౬.పాశురము

పుళ్ళుమ్ శిలుంబినకాణ్ పుళ్ళరయ్యన్ కోయిలిల్
వెళ్ళై విళిశంగిన్ పేరరవమ్ కేట్టి లైయో
పిళ్ళా యెళుంది రాయ్ పేయ్ ములై నంజుణ్డు
కళ్ళచ్చగడం కలక్కళియ క్కాలోచ్చి
వెళ్ళత్తరవిల్ తుయిల మర్ న్ద విత్తినై
ఉళ్ళత్తు క్కొండు మునివర్గళుమ్ యోగిగళుమ్
మెళ్ళ వెళున్దు ఆరియన్ర పేరరవమ్
ఉళ్ళమ్ పుగున్దు కుళిర్ న్దేలో రెమ్బావాయ్.

**భావము:** అందరికంటె ముందుగనే మేల్కొన్నవారు, ఇంకను నిద్రిస్తున్న ఒక గోపికను లేవకుండటాన్ని గమనించి 'తెల్లవారిందమ్మా! ఇక లేచిరావె!' అని లేపుచున్నారు. వేకువనే మేల్కొన్న పక్షులు ఒకరినొకరు పిలుచుకొంటూ 'మేతకు పోదాం రండర్రా!' అంటూ కూస్తూ పోతున్నాయి. అరె! పక్షిరాజ గరుత్మంతునికి రాజైన ఆ శ్రీమన్నారాయణుని కోవెలలో మ్రోగిన శంఖధ్వనిని నీవు విన లేదా? ఓసీ! పిచ్చిపిల్లా! (భగవద్విషయము నెరుగనిదానా!) లేచి రావమ్మా! ఇదిగో పూతనస్తనముల యందున్న విషాన్ని ఆరగించినవాడు, తనను చంపటానికి వచ్చిన శకటాసురుని కీళ్ళూడునట్లు తన కాళ్లతో తన్నినవాడు యైన ఈ శ్రీకృష్ణుడే ఆ పాల సముద్రంలో ఆదిశేషునిపై హాయిగా యోగనిద్రలో శయనించిన శ్రీమన్నారాయణుడు. ఆ శ్రీమన్నారాయణుడినే యోగులు, ఋషులు తమ హృదయాలలో నిల్పుకొన్నారు. అతనికి శ్రమ కలుగకుండునట్లుగ మెల్లగ 'హరీ! హరీ! అని అతనిని స్మరిస్తూ చేసిన ధ్వని పెద్దగా ధ్వనించి మా హృదయాలను చేరి చల్లబరిచింది. వణికించింది. మేమంతా మేల్కొన్నాము. మరి నీవుమాత్రము కదలక అట్లే పరుంటివేమమ్మా! ఇదీ నీకు వినబడలేదా! రమ్ము! రమ్ము! మాతో గూడి వ్రతము చేయుము.



## 7.పాశురము

కీశు కీశెన్రెజ్ఞమానై చాత్తకలన్దు !
పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో ! పేయ్ ప్పెణ్ణే !
కాశుమ్ పిరప్పుమ్ కలగలప్పక్కై పేర్తు
వాశ నరుఙ్ఞళ లాయిచ్చియర్ మత్తినాల్
ఓశై పడుత్త తయిర రవమ్ కేట్టిలైయో
నాయకప్పెణ్ణిళ్ళాయ్ ! నారాయణన్ మూర్తి
కేశావనై ప్పాడవుమ్ నీకేట్టే కిడత్తియో
తేశ ముడైయాయ్ ! తిర వేలో రెమ్బావాయ్.

**భావము:** ఓయీ! పిచ్చిపిల్లా! భరద్వాజ పక్షులన్నీ కీచుకీచుమంటూ చేస్తున్న కలకలములు వినపడలేదా? అదిగో! సువాసనలు వెదజల్లుతున్న కురులుగల ఆ గోప కాంతులు తాము ధరించిన ఆ భరణాలన్నీ ధ్వనించేట్టుగా చేతుల త్రిప్పుచూ కవ్వాలతో పెరుగు చిలుకుతున్నారు. ఆ ధ్వనులేవీ వినబడలేదా? నీవు మాకు నాయకురాలివికద! భాగవద్విషయానుభవము నెరిగినదానవు. సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే ఇపుడు శ్రీకృష్ణునిగా మన భాగ్యంకొద్దీ అవతరించాడు. మనకొరకే 'కేశి' మొదలైన రాక్షసులను చంపి మన కష్టాలను గట్టెక్కించాడు. మనమంతా అతనికి కృతజ్ఞులమై అతని గుణగానం చేస్తున్నాము. ఐనా... వానిని వింటూనే యింకనూ పడుకొనే వుంటివే? మేము పాడే యీ పాటల ఆనందముతో నీవు మెలిసిపోతున్నావులే! ఇకనైననూ లేచి రామ్మాతల్లీ! వ్రతం ఆచరించటానికి ఇంకనూ అలస్యందేనికి? అని 'ఒక గోపకన్యను లేపుతోంది ఆండాళ్ తల్లి.



## 8.పాశురము

కీళ్ వానమ్ వెళ్ళెన్రు ఎరుమై శిరువీడు
మేయ్ వాన్ పరన్దనకాణ్ మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్
పోవాన్ పోగిన్రారై పోగామల్ కాత్తున్నై
కూవువాన్ వన్దు నిన్రోమ్ కోదుకలముడైయ
పావాయ్ ! ఎళున్దిరాయ్ పాడిప్పరైకొణ్డు
మావాయ్ ! పిళన్దానై మల్లరై మాట్టియ
దేవాదిదేవనై చ్చెన్రునామ్ శేవిత్తాల్
ఆవావెన్రా రాయ్ న్దరుళేలో రెమ్బావాయ్.

**భావము:** తూర్పు దిక్కంతయు ఆకాశము తెల్లివారింది. గేదెలు మంచుమేత మేయటానికై విడువబడినాయి. అవి మేతకై స్వేచ్ఛగా తిరుగాడుతున్నాయి. తోటి గోపికలందరూ శ్రీకృష్ణుడు చేరక ముందుగనే అతని వద్దకు చేరవలెనని, అట్లు చేసిన అతడు చాల సంతోషించునని తలుస్తున్నారు. అందరును కలిసి గోష్ఠిగ పోవుటే మంచిదని యెంచి వారినందరినీ అచట నిలిపి నీ కొరకు వచ్చితిమి. నీకును అతనిని చేరుటకు కుతూహలముగనే వున్నదికదా! మరింక ఆలస్యమెందుకు? లెమ్ము! ఆశ్వాసురరూపుడైన కేశిని, చాణూర ముష్టికాదులను చీల్చి చెండాడిన శ్రీకృష్ణుని సన్నిధికి పోయి, మన నోమునకు కావలసిన 'పఱై' అనే సాధనమును పొందుదము. అతని రాకకు ముందే మనమటకు పోయిన అతడు 'అయ్యో! మీరు నాకంటే ముందుగనే వచ్చితిరే!' యని నొచ్చుకొని మన అభీష్టములను వెంటనే నెరవేర్చును.



## ౯.పాశురము

తూమణి మాడత్తుచ్చుట్రుమ్ విళక్కెరియ
ధూపమ్ కమళ త్తుయిలణై మేల్ కణ్ వళరుమ్
మామాన్ మగళే ! మణిక్కదవమ్ తాళ్ తిరవాయ్
మామీర్! అవళై యెళుప్పీరో ఉన్ మగళ్ దాన్
ఊమైయో ? అన్రిచ్చెవిడో ? అనన్దలో
ఏ మప్పెరున్దుయిల్ మన్దిరప్పట్టాళో ?
మామాయన్ మాధవన్ వైకున్దన్ ఎన్రెన్రు
నామమ్ పలవుమ్ నవిన్రేలో రెమ్బావాయ్

**భావము:** నిర్దోషమలైన మాణిక్యములతో నిర్మించిన భవనంలో చుట్టునూ దీపాలు వెలుగుతుండగా, అగరు ధూపములను పరిమళాలను వెదజల్లుచుండగా, అతిమెత్తనైన హంసతూలికా తల్పముపై పరుండి నిద్రిస్తున్న ఓ మేనమామ కూతురా! మణిమయ ప్రభలతో ప్రకాశించుచున్న నీ భవనపు గడియను తీయవమ్మా! ఏమమ్మా! మేనత్తా! నీవైనా ఆమెను లేపుమమ్మా! ఏమి? నీ పుత్రిక మూగదా? చెవిటిదా? లేక బద్ధకస్తురాలా? లేక ఆమె లేవకుండగ ఎవరినైన కావలి వుంచినారా? లేక యింత మైమరచి నిద్రించుటకేమైన మంత్రించి వుంచినారా? ఆమెకేమైనది నిద్ర లేచుటలేదు? 'ఓ ఆశ్చర్య గుణచేష్టితుడా! ఓ శ్రియః పతీ! ఓ పరమపదవాసీ!' అని అనేకమైన తిరునామాలను అనుసంధిస్తున్ననూ ఆమెకు వినబడుటలేదేమి? ఇంకను లేవదేమి? అని సంపదలతో తులతూగుతున్న ఒక కన్యను లేపుచున్నారు.



## 10.పాశురము

నోట్రుచ్చువర్కమ్ పుహిగిన్రవమ్మనాయ్
మాట్రముమ్ తారారో వాశల్ తిరవాదార్
నాట్రత్తుళాయ్ ముడి నారాయణన్ నమ్మాల్
పోట్రప్పరైత్తరుమ్ పుణ్ణియనాల్,పణ్ణొరునాళ్,
కూట్రత్తిన్ వాయ్ విళన్ద కుమ్భకరుణనుమ్
తోట్రు మునక్కే పెరున్దుయిల్ తాన్ తన్దానో ?
ఆట్రవనన్దలుడై యా యరుంగలమే
తేట్రమాయ్ వన్దు తిరవేలో రెమ్బావాయ్

**భావము:** నోము నోచి శ్రీకృష్ణ సంశ్లేష సుఖానుభవమును పొందుచున్న ఓయమ్మా! తలుపును తెరువుము, తలుపును తెరువకపోయినను మానెగాని, నోటినైనను తెఱచి పలుకవచ్చునుకదా తల్లీ! (జ్ఞానుల దర్శనము కంటె వారి శ్రీ సూక్తులను వినటమే చాల ముఖ్యమని చెప్పుచున్నది ఆండాళ్ తల్లి). పరిమళాలను వెదజల్లే తులసి మాలలను కిరీటముగా ధరించిన శ్రీ నారాయణుడు మనచే స్తోత్రము చేయబడినవాడై సంతసించి మనకు వ్రతోపక రణాలను (పఱై) ఇచ్చునుకద! పూర్వమొకనాడు ధర్మస్వరూపుడైన పరమాత్మ రామావతారుడై అవతరించి కుంభకర్ణుణ్ణి సంహరించాడు. ఆ కుంభకర్ణుడు తన పెనునిద్రను నీకేమైనా కానుకగా యిచ్చెనాయేమి? ఓ పెద్ద నిద్ర కలదానా! లేచిరమ్మ. నీవు మాకు శిరోభూషణమైనదానివి కద! తొట్రుపడక లేచివచ్చి మా గోష్ఠిలో చేరి మా వ్రతాన్ని పూర్తి చేయాలి. కనుక నీ యోగ నిద్రను వీడి లేచి రావమ్మా! అని ఐదవ గోపికను మేల్కొలుపుచున్నారు.



## 11.పాశురము

కట్రుక్క ఱ వైక్కణంగళ్ పలక అఱ్దు
శట్రార్ తి ఱలళియచ్చెన్రు శెరుచ్చెయ్యుమ్
కుట్రమొన్రిల్లాద కోవలర్తమ్ పొర్కొడియే
పుట్రరవల్ గుల్ పునమయిలే పోదరాయ్
శుట్రత్తుతోళిమా రెల్లారుమ్ వన్దునిన్
ముట్రమ్ పుహున్దు ముగిల్వణ్ణన్ పేర్పాడ
శిట్రాదే పేశాదే శెల్వప్పెణ్ణాట్టి ! నీ
ఎట్రుక్కు రంగమ్ పొరుళేలో రెమ్బావాయ్.

**భావము:** ఓ గోపాలకుల తిలకమా! ఓ చిన్నదానా! లేత వయస్సు కలిగిన పశువుల యొక్క అనేకమైన సమూహ సంపద కలిగిన మీ వంశం చాలా గొప్పది. ఆ సమూహాల పాలు పిదుకతగినవారును, శత్రువులు నశించునట్లు యుద్ధం చేయగలవారును, ఒక్క దోషమైనను లేనట్టి గొల్ల కులమున పుట్టిన బంగారు తీగవంటి అందమైనదానా! పుట్టలోని పాము పడగతో సమానమైన నితంబము కలదానా! ఓ వనమయూరమా! రమ్ము. నీ సఖులు, బంధువులును అందరు వచ్చి నీ వాకిట నిలిచియున్నారు. వీరందరూ నీలి మేఘమును బోలు శరీరకాంతిగల శ్రీకృష్ణుని అనేకమైన తిరునామములను పాడుచున్నారు. ఐనను నీవు మాత్రము చలించక, మాటాడక, ఏల నిదురించుచున్నావు? అని అనుచున్నారు. అనగా యింత ధ్వనియగుచున్ననూ ఉలకక, పలకక (ధ్యానములో) ఎందుకున్నావు? ఇది శ్రీకృష్ణ సంశ్లేష అనుభవానందమే కదా! మరి యీ సంశ్లేషాను భవానందమును నీ వొకతెవెకాక అందరును అనుభవించునట్లు చేయవలెకాన, మా గోష్ఠిలో కలిసి యీ వ్రతము పూర్తిగావించుము అనుచున్నారు.



## 12.పాశురము

కనైత్తిళం కట్రెరుమై కన్రుక్కిరంగి
నినైత్తుములై వళియే నిన్రుపాల్ శోర,
ననైత్తిలమ్ శేరాక్కుమ్ నర్ చెల్వన్ తంగాయ్
పనిత్తెలై వీళ నిన్ వాశల్ కడైపట్రి
శినత్తినాల్ తెన్నిలఙ్గైక్కోమానైచెట్ర
మనత్తుక్కినియానై ప్పాడవుమ్ నీవాయ్ తిఱవాయ్
ఇనిత్త నెళున్దిరాయ్ ఈదెన్న పేరుఱక్కమ్
అనైత్తిల్లత్తారు మఱిన్దేలో రెమ్బావాయ్

**భావము:** లేగ దూడలను తలుచుకొని గేదెలు పాలను నిరాటంకంగా స్రవిస్తూ వున్నాయి. ఆ పాల ధారలతో ఇంటి ప్రాంగణమంతా తడిసి బురదయైపోయింది. ఇంత సంపద కలిగిన గోపాలునికి నీవు చెల్లిలివైతివి. ఓయమ్మా! మేమందరము నీవాకిటకు వచ్చి పైనమంచు కురియుచున్నను సహించి నీ గడపనానుకొని నిలిచియున్నాము. పైన మంచు కురియుచున్నది క్రింద పాలధారలు బురద చేయుచున్నవి. మేమంతా మనస్సులో మాధవునే నింపుకొని వున్నాము. పైన మంచు కురియటమనే శ్రీసూక్తి ధారల ప్రవాహం సాగిపోతూంది. కాళ్ళ క్రింద పాలధారలనే ఆచార్య ఉపదేశ ప్రవాహం సాగిపోతోంది. మనస్సులలో నిరంతర మాధవ సంశ్లేష భక్తి ధారల విచ్చిన్నంగా పొంగిపొరలుతున్నా ఈ ముప్పేట ధారలతో తడిసి, తడిసి కూడా నిన్ను మా గోష్ఠిలో చేర్చుకొనుటకై నీవాకిట గుమ్మాన్ని పట్టుకొని నిలబడి వున్నామమ్మా! ఆనాడు సీతమ్మను అపహరించాడన్న క్రోధముతో పరమాత్ముడైన శ్రీరాముడు ఆ స్వర్ణలంకాధిపతియైన పది తలల రావణుని మట్టుబెట్టిన వాని గుణగణాలను స్తుతిస్తున్నాము. కీర్తిస్తున్నాము. పాడుతున్నాము. మేమింత చేయుచున్ననూ నీవు నోరైన మెదుపుట లేదేమి తల్లీ! ఇది యేమి మొద్దు నిద్దరమ్మా! నీ గొప్పతనాన్ని మేమెఱిగితిమిలేవమ్మా. నీ మొద్దు నిద్దుర విషయమంతా ఊరూ వాడ తెలిసిపోయిందిలే! ఇక నీ మొద్దునిద్దర చాలించి మేలుకో! (నీ ధ్యాన స్థితి నుంచి మేలుకో) మా గోష్ఠిలో చేరి వ్రతాన్ని సాంగోపాంగంగా పూర్తిచేయటానికి సహాయపడు అంటూ ఏడవ గోపికను లేపుచున్నారు.



## 13.పాశురము

పుళ్ళిన్ వాయ్ కీణ్డానై పొల్లావరక్కనై
క్కిళ్ళి క్కళైందానై క్కీర్తిమై పాడిప్పోయ్
ప్పిళ్ళైగళెల్లారుమ్ పావైక్కళమ్ బుక్కార్
వెళ్ళి యెళున్దు వియాళ ముఱఙ్గిత్తు
ప్పుళ్ళుమ్ శిలుంబినకాణ్ , పోదరిక్కణ్ణినాయ్
కుళ్ళక్కుళిరక్కుడైన్దు నీరాడాదే
పళ్ళిక్కి డత్తియోపావాయ్ ! నీ నన్నాళాల్
కళ్ళమ్ తవిర్ న్దు కలన్దేలో రెమ్బావాయ్

**భావము:** కంసునిచే పంపబడిన బకాసురుని నోటిని చీల్చిన శ్రీకృష్ణుని యొక్కయు, దుష్టుడైన రావణుని పది తలలను గిల్లి పారవైచిన శ్రీరాముని యొక్కయు కల్యాణ గుణ సంకీర్తనం చేస్తూ శ్రీకృష్ణుని సంశ్లేషముననుభవింపగోరు గోపికలందరును సంకేతస్థలమునకెప్పుడో చేరిపోయిరి. నీవింకను లేవకున్నావు. తెల్లవారినదని సూచించుచు శుక్రుడుదయించెను బృహస్పతి అస్తమించెను. ఇవిగో! పక్షులన్నియు తమ ఆహారాన్వేషణ నిమిత్తం అరచుకొంటూ ఆకాశంలోకి ఎగిరిపోతున్నాయి` అని గోపికలు చెప్పగా నిద్రిస్తున్న గోపిక తన కనులు తెరి చూచింది, ఆమె నేత్ర సౌందర్యానికి ముగ్ధులై వికసించిన తామరపూవులందు వ్రాలిన తుమ్మెద వంటి కన్నులు గలదానా! ఇకనైనను లేచి రావమ్మా! నీ నేత్ర సౌందర్యానికి ముగ్ధుడై శ్రీకృష్ణస్వామి తానే నీవద్దకు వచ్చునని భ్రమించకు. శ్రీ కృష్ణ విరహతాపమును దీర్చుకొనుటకు యీ చల్లని నీటిలో అందరితో కలిసి స్నానమాడగా రావమ్మా! ఇంకను పరుండరాదు. మనము నోచే యీ వ్రతమునకు ఇది శుభ సమయము, మంచి కాలము. ఓ సుందరీ! నీ కపటమును వీడి మా గోష్ఠిలో కలిసి మహిమాన్వితమగు యీ వ్రతము సాంగోపాంగముగ పూర్తి చేయుటకు సహకరించుము. అన్నింటను శుభములే కలుగును` అని గోదాదేవాదులు ఎనిమిదవ గోపికను మేల్కొలుపుతున్నారు.



## 14. పాశురము

ఉజ్ఞల్ పుళైక్కడై తోట్టత్తు వావియుళ్
శెజ్ఞళునీర్ వాయ్ నెగిలి న్దాంబల్ వాయ్ కూంబినకాణ్
శెజ్ఞల్పొడిక్కూరై వెణ్ పల్ తవత్తవర్
తజ్ఞల్ తిరుక్కోయిల్ శఙ్ఞిడువాన్ పోగిన్రార్
ఎజ్ఞలై మున్న మెళుప్పువాన్ వాయ్ పేశుమ్
నఙ్ఞా యెలున్దిరాయ్ నాణాదాయ్ నావుడై యాయ్
శఙ్ఞొడు శక్కర మేన్దుమ్ తడక్కైయన్
పఙ్ఞయక్కణ్ణానై ప్పాడేలో రెమ్బావాయ్.

**భావము:** ఏమె సఖీ! ఇదేమి? ముందుగ మమ్ములను లేపుదునంటివికదా! ఇంతవరకును పండుకొనే వున్నావేమి? లే! లెమ్ము! తెల్లవారిపోయినది. చూడు. మీ పెరటిలోని ఎర్రకలువలు విచ్చుకున్నవి. నీలోత్పలాలు ముకుళించినవి. కాషాయంబరులైన మునులు. యోగులు తెల్లని పలువరుసలు కలిగిన వారందరూ దేవాలయాలలో భగవదారాధన నిమిత్తమై కోవెల తలుపులు తీయటానికి 'కుంచెకోలను' తాళపు చెవులను తీసికొని వెళ్ళుచున్నారు. ఇవన్నీ ప్రాతః కాలమగు సూచనలేకదా! నీవు చేసిన వాగ్దానమును మరచితివా? నీకేమి? నీవు పూర్ణురాలవుకదా! సరే! ఇకనైన లేచిరమ్ము. వాగ్దానమును మరచిన సిగ్గులేని దానా? లేవవమ్మా అనగా 'నన్నేల నిందింతురు? నేనేమి చేయవలె?; ననగా శ్రీ శంఖచక్రములచే విరాజిల్లుచున్న విశాల సుందర భుజములు గలవానిని, పంకజాక్షుని ఆ శ్రీకృష్ణుని గుణగణములను మధురమైన స్వరమున కీర్తించవలెను. మేమును నీతో కలిసి పాడెదము. ఇట్లు గోష్ఠిగా సంకీర్తనము చేసిన మన వ్రతము ఫలించగలదు. కావున వెంటనే మేలుకొనుమమ్మా' అని గోదాదేవి యీ (పాశురంలో) తొమ్మిదవ గోపికను లేపిచున్నది.



## 15. పాశురము

ఎల్లే యిలంగిళియే ! యిన్నమురంగుడియో?
శిల్లెన్రళై యేన్మిన్? నఙ్గైమీర్, పోదరుగిన్రేన్
వల్లై ఉన్ కట్టురైగళ్ పణ్డేయున్ వాయఱిదుమ్
వల్లీర్గళ్ నీఙ్గళే, నానేదా నాయుడుగ
ఒల్లైనీ పోదాయ్, ఉనక్కెన్న వేఱుడైయై ?
ఎల్లారుమ్ పోన్దారో? పోన్దార్, పోన్దెణ్ణిక్కోళ్
వల్లానై కొన్రానై మాత్తారై మాత్తళిక్క
వల్లానై మాయనై ప్పాడేలో రెమ్బావాయ్.

**భావము:** ఈ మాలిక సంభాషణ రూపంలో వున్నది

బయటివారు – ఓ లేత చిలుకా! ఇంకను నిద్రిస్తున్నావా? ఇదేమి ఆశ్చర్యమే!

లోపలి గోపాంగన – పూర్ణులైన పూబోడులారా! ఇదిగో వస్తున్నాను.

బయటివారు – శీఘ్రముగా రావమ్మా!

లోపలి గోపాంగన – అబ్బా! గొల్లుమని ఉలికి పడునట్లు గొంతెత్తి చెవులు గడియలు పడునట్లు పిలువకండి. వస్తాలే!

బయటివారు – ఓ చిన్ని చిలుకా! నీవు చాలా చమత్కారంగా మాటాడుతావు. నీ నేర్పరితనము, నీ పుల్లవిరుపు మాటలు మేమిదివరకే యెరుగుదుములేమ్మ!

లోపలి గోపాంగన – మీరే అట్టి సమర్థులమ్మా! నేనేమీ కాదులే! ఐనా మీరన్నట్లు నేనట్టిదానినేనేమో! రావలసిన వారందరూ వచ్చిరా?

బయటివారు – ఆ అందరూ వచ్చి చేరారు. నీవే వచ్చి లెక్కజూడవచ్చు కదా!

లోపలి గోపాంగన – వచ్చి నేనేమి చేయవలెనో చెప్పరాదు?

బయటివారు – కువలయాపీడమనే కంసుని గజమును, కంసాది శత్రువులను సంహరించిన సర్వేశ్వరుడైన శ్రీ కృష్ణుని కల్యాణ గుణములను కీర్తింపగా రమ్ము. ఇట్లు చేసినగాని మనము చేయు వ్రతము శుభప్రదముగ పూర్తికాదు అని బయటినుంచి సమాధానము చెప్పి ఆమెను కూడ తమ గోష్ఠిలోనకి చేర్చుకొన్నారు గోపికలు.



## 16.పాశురము

నాయగనాయ్ నిన్ర నన్దగోపనుడైయ
కోయిల్ కాప్పానే ! కొడిత్తోన్రుమ్ తోరణ
వాశల్ కాప్పానే ! మణిక్కదవమ్ తాళ్ తిరవాయ్
ఆయర్ శిరుమియరోముక్కు అరై పరై
మాయన్ మణివణ్ణన్ నెన్నెలేవాయ్ నేర్ న్దాన్
తోయోమాయ్ వన్దోమ్ తుయిలెళప్పాడువాన్
వాయాల్ మున్నమున్నమ్ మాత్తాదే అమ్మా! నీ
నేశ నిలైక్కదవమ్ నీక్కేలో రెమ్బావాయ్.

**భావము:** మాకందరకును ప్రభుడైన నందగోపుని యొక్క తిరుమాళిగను రక్షించువాడా! మమ్ము లోనికి పోనిమ్ము. మేము వ్రేపల్లెలో నుండు గొల్లపిల్లలము. స్వామిని దర్శింపవచ్చాము. పరిశుద్ధులమయి వచ్చాము. మణులతో కూడిన గడియను తెరువుము. మేము స్వామికి శరణాగతి చేసినవారము. గొల్లకులమయిన పుట్టిన అజ్ఞానులమైననూ స్వామి యందత్యధిక ప్రేమానురాగములు కలవారము. స్వామికి సుప్రభాతము పాడి మేలుకొలుప వచ్చినాము. గొల్లవంశంలో పుట్టిన మాకు ఆశ్చర్య గుణ చేష్టితుడును. ఇంద్రనీల మణివర్ణముగల శరీరము కలవాడును అగు శ్రీకృష్ణుడు మాకు 'పఱై' అను ధ్వనించెడు వాద్యము నిత్తునని నిన్ననే వాగ్దానము చేసినాడు. ఇప్పుడనన్య ప్రయోజనులమై స్వామి నిద్రలేచునట్లుగ సుప్రభాతమును పాడగా వచ్చాము. స్వామీ! నీ నోటితో వద్దని చెప్పకుము. మమ్ములను అడ్డుకొనక ధృడముగా బంధించిన తలుపు గడియను వెంటనే తెరిచి లోనికి పోనీయమని కావలి వానిని వేడుకొంటున్నారు.



## 17.పాశురము

అమ్బరమే , తణ్ణీరే శోఱే అఱమ్ శెయ్యుమ్
ఎమ్బెరుమాన్ ! నన్దగోపాలా! ఎழுన్దిరాయ్,
కొమ్బనార్కెల్లామ్ కొழுన్దే ! కులవిళక్కే
ఎమ్బెరుమాట్టి! యశోదాయ్! అఱివురాయ్!
అమ్బర మూడఱుత్తోఙ్గి యులగలన్ద
ఉమ్బర్ కోమానే ! ఉఱఙ్గాదెழுన్దిరాయ్
శెమ్ పొర్కழల డిచ్చెల్వా ! బలదేవా !
ఉమ్బియుమ్ నీయు ముఱఙ్గేలో రెమ్బావాయ్.

**భావము:** ద్వారాపాలకులు గోపాంగనలను లోనికి అనుమతించగా వారు మొదట అన్న, వస్త్ర, తీర్థాదులను ధర్మబుద్ధితో దానము చేసే నందగోపులను 'స్వామి! మేలుకొను' మని ప్రార్థించారు. తరువాత 'ప్రబ్బలి తీగవంటి స్త్రీల కందరకును, తీగవలె ముఖ్యమైనదానా! గొల్లకులమునకు మంగళదీపము వంటిదానా! మాకును స్వామినివైన ఓ యశోదమ్మా! లేమ్మా!' అని వేడుకొనిరి. 'ఆకాశమంత ఎత్తుకెదిగి సమస్త లోకాలను కొలిచి దేవతలకే రాజైన ఓ కృష్ణా! ఇక నిద్ర చాలునయ్యా! మేలుకో!' అని ప్రార్థించిరి. ఆయన వేళకుండుట చూచి, బలరాముని లేపక తప్పు చేసితిమని ఎరిగి 'మేలిమి బంగరు కడియములతో శోభించు పాదయుగళిని గల ఓ బాలరామా! నీ తమ్ముడు శ్రీకృష్ణుడును, నీవును యింకను నిదురించుట తగదు. కావున శీఘ్రమే లేచి రండు!' అని అందరినీ క్రమము తప్పక మేల్కొలుపుచున్నారు. వారి కృపను వేడుచున్నారు.



## 18. పాశురము

ఉన్దు మదకళిత్త! నోడాద తోళ్వలియన్
నన్ద గోపాలన్ మరుమగళే ! నప్పిన్నాయ్ !
కన్దమ్ కమళుమ్ కుళలీ ! కడై తిరవాయ్
వన్దెఙ్గుమ్ కోళి అళైత్తనకాణ్ మాదవి
ప్పన్దల్ మేల్ పల్ కాల్ కుయిలి నఙ్గల్ కూవినగాణ్
పన్దార్ విరలి ! ఉన్ మైత్తునన్ పేర్పాడ
చెన్దామరైక్కైయాల్ శీరార్ వళై యొళిప్ప
వన్దు తిరువాయ్ మగిళిందేలో రెమ్బావాయ్.

**భావము:** నంద గోపులు మొదలుగా బలరాముని వరకు మేల్కొలిపి తలుపులు తీయమని ప్రార్థించినను వారు తెరువకపోవుటచేత, మదజలము స్రవించుచున్న ఏనుగువంటి బలము కలవాడై శత్రువులకు భయపడని భుజములుగల నందగోపుని యొక్క కోడలా! ఓ నప్పిన్న పిరాట్టి! పరిమళిస్తున్న కేశ సంపద కలదానా! తలుపు తెరువుమమ్మా! కోళ్లు వచ్చి కూయుచున్నవి. జాజి పందిళ్లమీద కోకిలలు గుంపులు గుంపులుగా కూడి మాటిమాటికి కూయుచున్నవి సుమా! నీవు, నీ భర్తయును సరసనల్లాపములాడు సందర్భములలో నీకు ఓటమి గలిగినచో మేము నీ పక్షమునేయుందుము. దోషారోపణకు వీలుగా ఆయన పేర్లను మేమే పాడెదములే! కావున అందమైన నీ చేతులకున్న ఆ భూషణములన్నీ ధ్వనించేటట్లుగా నీవు నడచి వచ్చి ఎర్ర తామరలవంటి నీ సుకుమారమైన చేతులతో ఆ తలుపులను తెరువుమమ్మా!` అని గోపాంగనలు నీళాదేవి నీ పాశురంలో మేల్కొల్పుచున్నారు.



## 19.పాశురము

కుత్తు విళక్కెరియ క్కోట్టుక్కాల్ కట్టిల్ మేల్
మెత్తెన్ర పఞ్చశయనత్తిన్ మేలేరి
కొత్తలర్ పూఙ్ఙళల్ నప్పిన్నై కొంగైమేల్
వైత్తుక్కిడన్ద మలర్ మార్పా ! వాయ్ తిరవాయ్
మెత్తడఙ్ఙణ్ణినాయ్ నీ యున్మణాలనై
ఎత్తనైపోదుమ్ తుయిలెళ ఒట్టాయ్ కాణ్
యెత్తనై యేలుమ్ పిరివాట్ర గిల్లాయాల్
తత్తువ మన్రుత్తగవేలో రెమ్బావాయ్.

**భావము:** గుత్తి దీపపు కాంతులు నలుదెసలా వెలుగులు ప్రసరించుచుండగా ఏనుగు దంతములచే చేయబడిన కోళ్లు గల మంచముమీద అందము, చలువ, మార్దవము, పరిమళము, తెలుపులనే - ఐదు గుణములు కలిగిన హంస తూలికా తల్పముపై పవ్వళించియుండు గుత్తులు గుత్తులుగా వికసించిన పువ్వులచే అలంకరించబడిన శిరోజములు కలిగిన నీళాదేవి యొక్క స్తనములను తన విశాల వక్షస్థలముపై వైచుకొని పవళించియున్న ఓ స్వామీ! నోరు తెరచి ఒక్క మాటైననూ మాటాడకూడదా? లేక కాటుకచే అలంకరింపబడిన విశాలమైన నేత్రములు కల ఓ నీళాదేవీ! జగత్స్వామియైన శ్రీకృష్ణుని స్వల్పకాలమైనను పడక విడిచి బయటకు వచ్చుట కనుమతింపకున్నావు! క్షణమైనను శ్రీకృష్ణుని విశ్లేషమును సహింపజాలవే? ఇది నీ స్వరూపమునకు, నీ స్వభావమునకును తగదు. నీవలె మేము కూడా అతనికి అనన్యార్హ శేషభూతులమేకదా! కాన కరుణించి కొంచెమవకాశమీయుము తల్లీ! అట్టి అవకాశము నీవిచ్చితివేని మేము చేసే యీ అద్వితీయమైన ధనుర్మాస వ్రతము భగవత్కైంకర్యరూప మంగళ వ్రతముగా సాంగోపాంగముగ సమాప్తి చెందును. ఇందేమాత్రమూ సంశయము లేదు అని ఆండాళమ్మగారు నీళా శ్రీకృష్ణులను వేడుకొంటున్నారు.



## 20.పాశురము

ముప్పత్తు మూవర్ అమరర్కు మున్ శెన్రు
కప్పమ్ తవిర్కుమ్ కలియే తుయిలెళాయ్
శెప్పముడైయాయ్ తిఱలుడైయాయ్ ! శెట్రార్కు
వెప్పమ్ కొడుక్కుమ్ విమలా తుయిలెళాయ్
శెప్పన్న మెన్ములైచ్చెవ్వాయ్ చ్చిరు మరుంగుల్
నప్పిన్నై నంగాయ్ ! తిరువే ! తుయిలెలాయ్
ఉక్కముమ్ తట్టొళియుమ్ తన్దున్ మణాళనై
ఇప్పోదే యెమ్మై నీరాట్టేలే రెమ్బావాయ్.

**భావము:** ముప్పది మూడు కోట్ల దేవతలకు ఏ విధమైన సంకటములు వచ్చినను ముందుగనే అటకుపోయి వారిని రక్షించు సమర్ధతగల ఓ స్వామీ! నిద్రలేచిరమ్ము. ఆశ్రితులను రక్షించుటకై వారి విరోధులను దునుమాడు బలాఢ్యుడా! ఆశ్రిత రక్షకా! ఓ బలశాలీ! శత్రువులకే అతి దుఃఖమునిచ్చే నిర్మలుడా! నిద్ర నుండి మేల్కొను స్వామీ!` అని స్తుతిస్తూ మేల్కొల్పినను స్వామి మేల్కొనకుండుట చూచి, జగన్నాటక సూత్రధారియైన ఆ జగన్నాధుని మేల్కొలుపుమని నీళాదేవిని ప్రార్ధిస్తున్నారు గోపికలు. బంగారు కలశముల వంటి స్తనద్వయమును, దొండపండు వంటి అధరములను, సన్నని నడుమును కల్గి అతిలోక సుందరముగ విరాజిల్లుచున్న ఓ నీళాదేవీ!మాయమ్మా! నీవు శ్రీమహాలక్ష్మీ దేవికి సమానురాలవు! కరుణించి నీవైన మేల్కొనవమ్మా! 'నేను లేచి మీకేమి చేయవలెనందువేమో!` వినుము - మన స్వామియైన శ్రీకృష్ణునకు శరీరముపై చిరుచెమట పట్టినపుడు దానిని ఉపశమింపచేయగా వీవన కైంకర్యమును చేయుటకు ఒక దివ్యమైన వీవన (విసనకర్ర) నిమ్ము! ప్రబోధ సమయాన స్వామి తిరుముఖ మండలము జూచుకొనుటకు ఒక దివ్య మణిదర్పణము (అద్దము) నిమ్ము. వీటన్నింటిని మాకనుగ్రహించి, స్వామిని మేల్కొలిపి, మమ్ము అతనితో కూర్చి మంగళస్నానము చేయింపుము తల్లీ! నీ యనుగ్రహమున్ననే కద మా యీ వ్రతము మంగళముగ పూర్తికాగలదు?` అని ఆండాళ్ తల్లి నీళాదేవిని వేడుకొంటున్నారు యీ పాశురంలో.



## 21.పాశురము

ఏట్రకలంగ ళెదిరిపొంగి మీదళిప్ప
మాట్రాదే పాల్ శొరియుమ్ వళ్లల్ పెరుమ్ పశుక్కల్
ఆట్ర ప్పడైత్తాన్ మగనే ! యఱివురాయ్
ఊట్రముడై యాయ్ ! పెరియాయ్ ! ఉలగినిల్
తోట్రమాయ్ నిన్ర శుడరే ! తుయిలెళాయ్
మాట్రారునక్కు వలితులైన్దు ఉన్ వా శర్కణ్
ఆట్రాదు వన్దు ఉన్నడి పణియు మాప్పోలే
పోట్రియామ్ వన్దోమ్ పుగళ్ న్దు ఏలోరెమ్బావాయ్

**భావము:** పాలను పిడుకుటకై పొదుగల క్రింద ఎన్ని భాండములుంచినను అవన్నియు పొంగి పొరలి పోవునట్లు క్షీరధారలను వర్షించే గోసంపద గల్గిన శ్రీ నందగోపుని కుమారుడవైన ఓ శ్రీకృష్ణా! మేల్కొని మమ్ము కనరా వయ్యా! అప్రతిహత ధైర్య సాహసములను కల్గియును ఆశ్రితపక్షపాతివై, సర్వులకును ఆత్మ స్వరూపుడవైన నీవు యీ భూలోకమునందు అవతరించిన ఉజ్జ్వల రత్న దీపమా! వేద ప్రమాణ ప్రసిద్ధుడా! ఆ వేదము చేతనైనను ఎరుక పడనంతటి మహా మహిమాన్వితుడా! ఈ దీనులను కటాక్షించి మేలుకొనుము. శత్రువులెల్లరు నీ పరాక్రమమునకు తాళజాలక భయపడి నీకు ఓడిపోయి, నీవాకిట నిల్చి, నన్ను శరణుజొచ్చిన రీతిని మేమందరమూ అనన్య ప్రయోజనులమై 'నీవే తప్ప ఇతః పరంబెరుగ'మని నీ పాదానుదాసులమై వచ్చితిమి. నీ దాసులమైన మేమందరమును నీ దివ్య కల్యాణ గుణ సంకీర్తనము చేయగా వచ్చినాము. నీ దివ్య మంగళ విగ్రహమునకు దివ్య మంగళా శాసనము చేయ నిల్చినాము స్వామీ! నిన్నాశ్రయించి వచ్చిన మమ్ము కరుణించుటకు మేలుకొనుస్వామీ! లేచి రావయ్యా! అని వేడుకొంటున్నారు.



## 22.పాశురము

అంగణ్ మాజ్ఞాలత్తరశర్ అభిమాన
బజ్ఞమాయ్ నన్దు నిన్ పళ్ళిక్కట్టిల్ కీళే
శజ్ఞమిరుపార్ పోల్ వన్దుతలై ప్పెయ్ దోమ్
కింగిణివాయ్ చ్చెయద తామరప్పూప్పోలే
శెంజ్ఞణ్ శిరిచ్చిరిదే యేమ్మేల్ విళియావో
తింగళు మాదిత్తియను మెళున్దార్పోల్
అజ్ఞణ్ణిరణ్డుం కొండు ఎజ్ఞళ్ మేల్ నోక్కుదియేల్
ఎజ్ఞళ్ మేల్ చాబ మిళన్దేలో రెమ్బావాయ్.

**భావము:** ఈ సుందర సువిశాలమైన భూమిని ఏకఛత్రాధిపత్యముగ నేలిన రాజులందరును తమ కెదురెవ్వరు లేరను అహంకారమును వీడి, అభిమానులై నీ శరణు జొచ్చిరి. అనన్య శరణాగతిని చేయుచు నీ సింహాసనము క్రింద గుంపులు గుంపులుగా చేరినట్లు మేమును అనన్య ప్రయోజనులమై వారివలె నీ శరణుజొచ్చినాము. మాకు నీవు దక్క వేరు దిక్కులేదు స్వామీ! చిరుమువ్వలు నోళ్ళు తెరచినట్లుగను, సగము విరిసిన తామరపూవువలెను మెల్లమెల్లగా విప్పారిన నీ సుందర నేత్రాలనుంచి జాలువారు వాత్సల్య కరుణారస దృక్కులను మాపై ప్రసరింపనిమ్ము. సూర్యచంద్రులుదయించెయనునట్లు కనిపించు నీ కన్నుదోయి నుంచి జాలువారే కరుణ వాత్సల్యం రసదృక్కులు మాపై ప్రసరించినచో మా కర్మ బంధములన్నీ తొలగిపోవును కనుక మా కర్మబంధములు తొలగగనే మేము నిన్ను చేరుకొందము కద! మా వ్రతమునకు పొందవలసిన ఫలము గూడ యిదియేగదా! యని ఆండాళ్ తల్లి కర్మ బంధం. తొలగితే ముక్తి లభిస్తుందని` తెలియజేస్తోంది.



## 23.పాశురము

మారిమలై ముళఞ్జిల్ మన్నిక్కిడన్దుఱఙ్గుమ్
శీరియ శిఙ్గరివిత్తుత్తీ విళిత్తు
వేరిమయిర్ పొఙ్గ వెప్పాడుమ్ పేర్ న్దుదరి
మూరి నిమిర్ న్దు ముళఙ్గిప్పురప్పట్టు
పోదరుమాపోలే, నీ పూవైప్పూవణ్ణా ! ఉన్
కోయిల్ నిన్రిఙ్గనే ఫోన్దరుళి కోప్పుడైయ
శీరియ శిఙ్గాపనత్తిరున్దు యామ్ వన్ద
కారియమారాయ్ న్దరుళేలో రెమ్బావాయ్

**భావము:** వర్షా కాలములో చలనము లేకుండ పర్వత గుహలో ముడుచుకొని పరుండి నిద్రించుచున్న సింహము మేల్కొని, తీక్షణమైన తన చూపులతో నలుదెసలా పరికించినట్లును, పరిమళముగల తన జూలునిక్కబొడుచునట్లు అటునిటు దొర్లి, లేచి తన శరీరమును బాగుగ సాగదీసి, ఒళ్లు విరుచుకొని ఒక్క పెట్టున గర్జించి, గుహనుంచి రాజఠీవితో బయటకు వచ్చిన విధంగా అతసీ పుష్పపు రంగును కలిగిన ఓ స్వామీ! నీవు నీ భవనము నుండి ఆ సింహరాజము రీతిని వచ్చి, మనోహరంగా అలంకరింపబడిన యీ దివ్య సింహాసనమును అలంకరించవలె! అటుపై మేము వచ్చిన కార్యము ఎరుగవలె! ఎరిగి మా అభీష్టాన్ని అనుగ్రహించవలె!' అని స్వామిని గోపికలతో కూడిన ఆండాళ్ తల్లి తమ మనోభీష్టాన్ని తెలియజేసింది.



## 24.పాశురము

అన్రివ్వులగ మళన్దాయ్! ఆడిపోట్రి
చ్చెన్రఙ్గుత్తెన్నిలజ్గైశెత్తాయ్! తిఱల్ పోట్రి
పొన్రచ్చెగడ ముదైత్తాయ్ ! పుగళ్ పోట్రి
కన్రు కుణిలా వెఱిన్దాయ్ ! కళల్ పోట్రి
కున్రుకుడైయా వెడుత్తాయ్ ! గుణమ్ పోట్రి
వెన్రు పగైక్కెడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్ పోట్రి
ఏన్రెన్రున్ శేవగమే యేత్తిప్పఱై కొళ్వాన్
ఇన్రియామ్ వన్దోమ్ ఇరజ్గేలో రెమ్బావాయ్.

**భావము:** అలనాడు బలివలన దుఃఖితులైన దేవతలను రక్షించుటకు రక్షించుటకు త్రివిక్రముడవై మూడు లోకాలను కొలిచిన వామనుడా! నీ రెండు పాదములకును మంగళము! సీతమ్మ నపహరించిన దుష్టుడగు రావణుని లంకను గెల్చిన ఓ శ్రీరామా! నీ ధీరతకు మంగళము! బండి రూపంలో శకటాసురుడనేరాక్షసుడు నిన్ను చంపప్రయత్నింపగా వాని కీళ్ళూడునట్లు తన్నిన నీ కీర్తి ప్రభలకును మంగళము! దూడ రూపమున నిన్ను చంపవచ్చిన వత్సాసురుడనే రాక్షసుని. వెలగచెట్టుగా దారికి ప్రక్కన నిల్చిన కపిత్థాసురుడనే రాక్షసుని ఒక్కసారిగా సంహరించిన నీ వంచిన పాదమునకు మంగళము! దేవేంద్రుడు రాళ్ళ వర్షమును కురిపించగా గోవర్ధనగిరిని గోడుగుగా నెత్తి గోకులమును రక్షించిన నీ ఆశ్రిత రక్షణ గుణమునకును మంగళమగుగాక! శత్రువులను చీల్చి చెండాడునట్టి నీ చేతి చక్రమునకు మంగళ మగుగాక! ఇట్లు నీ వీర గాథలన్నేన్నింటినో నోరార స్తుతించుచు నీ నుండి మా నోమునకు కావాల్సిన పరికరములను పొందుటకై మేము నేడు యిచ్చొటకు వచ్చి యున్నాము. కావున మా యందు దయచేసి వానిని కృపతో ప్రసాదింపుము. అని గోపికల్లెలరు స్వామిని వేడుకొన్నారు.



## 25.పాశురము

ఒరుత్తి మగనాయ్ పిఱన్దు ఓరిరవిల్
ఒరుత్తి మగనాయ్ ఒళిత్తు వళర,
తరక్కిలా నాగిత్తాన్ తీఙ్గునినైన్ద
కరుత్తైప్పిళ్ళైకఞ్జన్ వయిట్రిల్
నెరుప్పెన్న నిన్ర నెడుమాలే ! యున్నై
అరుత్తిత్తు వన్దోమ్ , పఱై తరుతియాగిల్
తిరుర్రక్క శెల్వముమ్ శేవగముమ్ యామ్పాడి
వరుత్తముమ్ తీర్ న్దు మగిళిన్దు ఏలో రెమ్బావాయ్.

**భావము:** ఓ కృష్ణా ! పరమ భాగ్యవతియగు శ్రీ దేవకీదేవికి ముద్దుల పట్టిగ అవతరించి, అదే రాత్రి శ్రీ యశోదాదేవికి అల్లారు ముద్దుబిడ్డవై రహస్యముగా శుక్లపక్ష చంద్రునివలె పెరుగుచుండగా. గూఢచారులవలన యీ విషయము నెరిగిన కంసుడు నిన్ను మట్టుబెట్టుటకు అలోచించుచుండగా అతని యత్నములన్నిటిని వ్యర్ధముచేసి అతని గర్భమున చిచ్చుపేట్టినట్లు నిల్చిన భక్తవత్సలుడవు! అట్టి నిన్ను భక్తి పురస్సరముగా ప్రార్ధించి నీ సన్నిధికి చేరినాము. మాకు యిష్టార్ధమైన 'పఱ' అను వాద్యమును అనుగ్రహింపుము. ఇట్లు మమ్మనుగ్రహించిన శ్రీ లక్ష్మీదేవి యాశపడదగిన సంపదను, దానిని సార్ధిక పరచు నీ శౌర్యమును కొనియాడి నీ విశ్లేషములవలన కలిగిన సంకటమును నివారణ చేసికొని మేము సుఖింతుము . నీ విట్లు కృపచేయుటవలన మా యీ అద్వితీయమైన వ్రతము శుభమగు సంపూర్ణమగును.



## 26.పాశురము

మాలే ! మణివణ్ణా ! మార్గళి నీరాడువాన్
మేలైయార్ శెయ్ వనగళ్ వేణ్డువన కేట్టియేల్
ఞాలత్తై యెల్లామ్ నడుజ్గ మురల్వన
పాలన్న వణ్ణత్తు ఉన్ పాఞ్చశన్నియమే
పోల్వన శఙ్గఙ్గళ్, పోయ్ ప్పాడుడై యనవే
శాల ప్పెరుమ్ పఱైయే, పల్లాణ్డిశైప్పారే
కోలవిళక్కే, కొడియే, విదామే
ఆలినిలైయాయ్ ! అరుళేలో రెమ్బావాయ్.

**భావము:** ఆశ్రిత వ్యామోహమే స్వరూపముగా కలిగిన ఇంద్రనీలమణి వంటి శరీరముకలవాడా! ఓ వటపత్రశాయీ! మార్గశీర్ష మాస స్నానం చేయగా వచ్చాము. మా పూర్వులున్నూ యీ స్నాన వ్రతాన్ని ఆచరించియున్నారు. ఈ వ్రతానికవసరమగు పరికరములను నిన్నర్థింపగా వచ్చాము. దయచేసి ఆలకింపుము. భూమండలమంతయు వణుకు కల్గించునట్లు ధ్వనించే పాలవంటి తెల్లనైన శఖంములు సరిగా నీ పాంచజన్యము వంటివి కావలెను. అతిపెద్దవైన పఱవంటి వాద్యములు కావలెను. మృదుమధురమైన కంఠములతో మంగళ గానాలను పాడే భాగవతులను కావాలి. వ్రతంలో ముందుకు సాగే నిమిత్తం మంగళదీపము కావాలి. వ్రాత సంకేతములుగా అనేక చాందినీలు కావాలి. లోకలన్నింటినీ నీ చిరుబొజ్జలో దాచుకుని, ఒక లేత మఱ్ఱి యాకుమీద పరుండిన నీకు చేతకానిదేమున్నది స్వామీ! కరుణించి మా వ్రతము సాంగోపాంగముగ పూర్తియగునట్లు మంగళాశాసనము చేసి వీనిని ప్రసాదింపుము.



## 27.పాశురము

కూడారై వెల్లుమ్ శీర్ గోవిన్దా ! ఉన్దన్నై
ప్పాడిప్పఱై కొణ్డుయామ్ పెఱుశెమ్మానమ్
నాడుపుగళుమ్ పరిశినాల్ నన్రాగ
చ్చూడగమే తోళ్ వళైయే,తోడే శెప్పూవే,
పాడగమే,యెన్రనైయ పల్ కలనుమ్ యామణివోమ్,
ఆడై యుడుప్పోమ్, అదన్ పిన్నే పాల్ శోఱు
మూడ నెయ్ పెయ్ దు ముళఙ్గైవళివార
కూడి యిరున్దు కుళిర్ న్దేలోరెమ్బావాయ్

**భావము:** నిన్ను ఆశ్రయింపని వారిని కూడా వారి మనసులను మార్చి నీకు దాసులౌనట్లు చేసి విజయాన్ని సాధించగల ధీమంతుడా ఓ గోవిందా! నిన్ను సుత్తించి నీనుండి 'పఱ' అనే వాద్యాన్ని పొంది లోకులచే సన్మానింపబడలేనని మా కోరిక నీ అనుగ్రహానికి పాత్రులమైన మమ్ము లోకమంత పొగడాలి. మేము పొందు ఆ సన్మానము లోకులందరూ పొగుడునట్లుండాలి. అనాటి మా రూపాలు ప్రకాశవంతంగా, తేజోమయంగా విరాజిల్లుతూ వుండాలి. దానికై మాకు కొన్ని భూషాణాలు కావాలి. ముంజేతులకు కంకణాలు కావాలి. భుజముల నాలంకరించుకొనుటకు భుజకీర్తులు కావాలి. దండలకు తోడవులును ఇంకా ఎన్నో అభూషణములను నీవనుగ్రహించగ మేము ధరించాలి. సన్మానమొందాలి. వీటన్నింటిని ధరించి ఆపై మేలిమి చీరలను కట్టుకోవాలి. అటుపై క్షీరాన్నము మునుగునట్లు పోసిన నేయి మోచేతిగుండా కారుచుండగ మేమంతా నీతో కలసి చక్కగా అరిగించాలి. ఇదీ మా కోరిక . ఇట్లైన మా వ్రతము మంగలప్రదమైనట్లే!



## 28.పాశురము

క ఱవైగళ్ పిన్ శెన్రు క్కానమ్ శేర్ న్దుణ్బోమ్,
అఱివొన్రు మిల్లాద వాయ్ క్కులత్తు ఉన్దన్నై
ప్పిఱవి పె ఱున్దనై పుణ్ణియమ్ నాముడైయోమ్
కు ఱైవొన్రు మిల్లాద గోవిన్దా !ఉన్దన్నోడు
ఉఱవేల్ నమక్కి ఙ్గొళిక్క వొళియాదు
అఱియాద పిళ్ళైగళోమ్, అన్బినాల్ ఉన్దన్నై
చిఱుపేరళైత్తనవుమ్ శీఱి యరుళాదే
ఇఱైవా నీ తారాయ్ పఱైయేలో రెమ్బావాయ్.

**భావము:** ఓ కృష్ణా! మేము అవివేక శిఖామణులము, తెల్లవారగానే చద్దిత్రాగి పశువుల వెంట అడవికిపోయి, పశువులను మేపి సాయంకాలము తిరిగి చేరేవారము . వువేకమేమాత్రమును లేనివారము. అజ్ఞానులము. గొల్లపడుచులము . నీవు మా గొల్లకులంలో జన్మించటయే మాకు మహాభాగ్యము . నీతోడి సహవాసమే మాకదృష్టము. యీ బంధమెన్నటికినీ తెగనిది. త్రెంచిలేనిది. అందుకే మా గోపికాకులం ధన్యమైంది. పరిపూర్ణ కళ్యాణగుణగుణాలతో ప్రకాశించే నీవు గోవిందుడువు. మాకు లోక మర్యాద మేమాత్రము తెలియక నిన్ను చిన్నచిన్న పేర్లతో కృష్ణా! గోవిందా! అని పిలిచాము. స్వామీ! అందుకు కోపగించుకోకు! జ్ఞానులు పొందవలసిన ఆ పద వాద్యమును యీ కారణమున మాకు యివ్వననబోకుము. నీతో మెలిగిన సుఖలమనే యెంచి మాపై కృపచేయుము . అని గోపికలందరూ స్వామికి శరణాగతిని చేశారు. తమను అనుగ్రహించి వ్రతమును పూర్తిచేయగ ఆశీర్వదించుమని, తమ తప్పులను సైరించమని క్షమాయాచన చేశారు.



## 29.పాశురము

శిత్తమ్ శిఱుకాలే వన్దున్నై చ్చేవిత్తు, ఉన్
ప్పొత్తామరై యడియే ప్పోత్తుమ్ పొరుళ్ కేళాయ్
పెత్తమ్మేయ్ త్తుణ్ణుం కలత్తిల్ పిఱన్దనీ
కుత్తేవ లెంగళై క్కొళ్ళమల్ పోగాదు
ఇత్తై పఱై కొళ్వా నన్రుకాణ్ గోవిన్దా !
ఎత్తైక్కుమేళేళు పిఱవిక్కుమ్, ఉన్దన్నో
డుత్తోమే యావోమునక్కే నామాళ్ శెయ్ వోమ్
ముత్తిన ఙ్కామంగళ్ మాత్తేలో రెమ్బావాయ్

**భావము:** ఓ స్వామీ! శ్రీకృష్ణా! నీ పాదారవింద దాసులమగు మేము మిక్కిలి వేకువనే లేచి, నీ సన్నిధికి వచ్చి, నిన్ను దర్శించి నీ సుందర తిరివడులకు మంగళాశాసనము చేయుటే మాకు పరమావధి, ఎందుకనగా పశువులను మేపి మా జీవిక నడుపుకొను అజ్ఞానులమైన మేము చేసే అంతరంగ సేవలను నీవు స్వీకరించకుండ వుండరాదు. ఏలన నీవు మా గోల్లకులములో జన్మించి మా కులమును , మమ్మూలను ధన్యులను చేసినవాడవు , ఓ గోవిందా! పుండరీకాక్షా! మేము నీ వద్దకు 'పఱ' అను వాద్యమును పొందుటకు రాలేదు. అది ఒక నిమిత్తమే! వ్రతమూ నిమిత్తమే! మేము ఏడేడు జన్మముల వరకును మరియు యీ కాలతత్వముండు వరకును నీకు అనవార్యశేషభూతులమై నీతోడ చేరి, నీ దాస్యమును చేయుచచుండువారము కామా? మా యందు , యితరములై ఆపేక్షలేవైన యున్నచో వానిని తొలగించి మమ్ము కృపజూడుము స్వామీ! సదా నీ సేవలను మాకోసగమును అని వ్రత ఫలమును అండాళ్ తల్లి వివరించింది.



## 30.పాశురము

వఙ్గ క్కడల్ కడైన్ద మాదవనై కేశవనై
తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయిళై యార్ శెన్నిరైఞ్జి
అఙ్గప్పరై కొణ్డవాత్తై, అణిపుదువై
పైఙ్గమల త్తణ్తెరియల్ పట్టర్ పిరాన్ కోదై శొన్న
శఙ్గత్తమిళ్ మాలై ముప్పదుమ్ తప్పామే
ఇఙ్గప్పరిశురై ప్పారీరరణ్డు మాల్వరైత్తోళ్
శె ఙ్గణ్ తిరుముగత్తు చ్చెల్వత్తిరుమాలాల్
ఎఙ్గుమ్ తిరువరుళ్ పెత్తిన్బురువ రెమ్బావాయ్

**భావము:** ఓడలుగల పాల సముద్రమును దేవతలకోసం మథించి, వారికి అమృతాన్ని ప్రసాదించినవాడును, బ్రహ్మరుద్రాదులకు ప్రభువైనట్టి నారాయణుని చంద్రముఖులైన గోపికలు ఆలంకృతులై చేరి, మంగళాశాసనము చేసి, గోకులమునందు `పఱై` అను వంకతో స్వామీ కైంకర్యమును పొందారు.
వీరు పొందిన యీ కైంకర్య విధమునంతను అలంకారమైన శ్రీవిల్లిపుత్తూరులో అవతరించినట్టియును, తామర పూసల మాలలను ధరించిన పేరియాళ్వార్ల (విష్ణుచిత్తుల) పుత్రికయైన గోదాదేవి (అండాళ్ తల్లి) సాయించింది. ఇది గోపికలు గుంపులు గుంపులుగ కూడి అనుభవించిన ప్రబంధమై, ద్రావిడ భాషలో పాశురరూపంగా ప్రవహించింది.

ఈ ముప్పది పాశురాలను ఒక్కటిని కూడా విడువకుండ యీ సంసారమున అనుసంధించువారు గొప్ప పర్వతవలెనున్న నాల్గు భుజములును ఆశ్రిత వాత్సల్యముచే ఎఱ్ఱబారిన కనుదోయిగల శ్రీముఖమును. ఉభయ విభూతి ఐశ్వర్యములందునుగల శ్రియ: పతియొక్క సాటిలేని దివ్య కృపను పొంది, బ్రహ్మానందముతో కూడినవారై యుండగలరు. శ్రీ గోదా రంగనాథుల అవ్యాజకృపచే యీ `తిరుప్పావై` ద్రవిడ దివ్య ప్రబంధమును తెలుగున` శ్రీసూక్తిమాలిక` గ` ప్రవహింపచేసి పాడించుకున్న వారి దివ్యవాత్సల్యమునకు యీ దాసుడు రంగనాథుడు ఆజన్మ కృతజ్ఞతాంజలులు ఘటిస్తున్నాడు.

శ్రీ ఆండాళ్ తిరువడిగలే శరణం

